శ్రీ

# గిరోకీర్తన భజనకీర్తనలు

ఇందు

భల్లాణరాజ చరిత్రము గిరోకీర్తనగాను, సానందో
పాఖ్యానమును మఱి పార్వతీపరమేశ్వరస్తుతియు
భజనకీర్తనలుగాను, భక్తజనుల
కుపయుక్తముగా నున్నవి.

ఇవి

బందరు సర్క్యూల్పేట నివాసులు నత్యంత శివభక్తులు నగు
శివలెంక శంభులింగము పంతులుగారు
(కృష్ణాజిల్లా డి. పి. డబ్ల్యు. ఇంజినీరు)
పూర్వము విరచించి యుంచగా

తత్పుత్రుండు (రిటైర్డు లోకల్ ఫండు ఓవర్సీయర్) అగు
శివలెంక పాపయ్యపంతులు

సరస చతుర్విధ కవితా సామ్రాజ్య ధురంధరులగు
నాదెళ్ల పురుషోత్తమ కవివరునిచే
పరిష్కరింపించి

బందరు, తెలుగు లాజర్నల్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటించెను.

ఆగస్టు 1914. ] [ వెల ౧ అణా.



# పీఠిక

సీ॥ శ్రీమన్మహాదేవ సేవాపరాయణుఁ
డార్యసన్నుతభూరియశుఁడు నైన
మాడపాట్యన్వయ మహితుఁడౌ వేంకటే
శ్వరరావు పంతు లస్మద్ధితుండు
కూడి యొక్కప్డు మాటాడుచునుండంగ
నీ పురాతన గ్రంథ మేనుజూప
గను బ్రకటింపంగ నను బురికొల్పియు
నందులకగు ద్రవ్య మపుడ యొసగె

గీ॥ ధార్మికుం డొండె కనుఁగొను ధర్మమందు
రిదియొకద జగదుపకృతి యితఁడొనర్చె
నింతకాలంబు నూరక యేను గడప
నిట్టె పనిబూని యశమందె నీఘనుఁడు॥





ఓం

శ్రీ బాలాత్రిపుర సుందర్యైనమః

# భల్లాణచరిత్ర.

---

రాగం. — నాదనామక్రియ. — కోలాటపాట.

శ్రీ సీతారాముల నీతిచరిత్రము — అను మాదిరి.

1. శ్రీకైలాస నివాసుచరిత్ర ప్రసిద్ధిగ వినుచున్న । వారికి శుభము లిచ్చునన్న । సభక్తుని నాతని గనుగొన్న॥ జనంబుల । పాతకముల దగ బారదోలి శివపద మొసంగునన్న॥

2. నైమిశాటవిని శౌనకాది మునినాథు లలరి సూతున్ । భక్తి నిగని యనిరి వినీతున్ । ప్రమథ కథారసవిజ్ఞాతున్ ॥ ఘనమతి । నీచే దెలుపంబడె మాకనువుగ నందుల గలలోతుల్॥

3. ఇటుబల్కిన విని సూతుండక్కథ నేర్పరించి జెప్పన్ । బూనెను బుషులకు నయమొప్పన్ । వినుడని గురున కెఱఁగి గొప్పన్॥ గల మర్త్యస్థలి సింధుకటక మతికాంతులు నింగిని గప్పన్ ॥ శ్రీ ॥

4. ఆపురమున మణిగోపురములచే నమరుచుండు మేడల్ ।
కనకఘటితములగు గోడల్ । సుధీజన లసితములగు వాడల్ ॥
గలవట । కడురమ్యంబుగ మంత్రి పురోహిత వరులు బం
ట్ల ప్రోడల్ ॥ శ్రీ ॥

5. పటుగతి నప్పుర మేలుచుండి యాభల్లాణుడు మించెన్ । సతీ
ద్వయ సన్నుతులటుగాంచెన్ । గురువరుగాంచి బ్రస్తు
తించెన్ ॥ భక్తులడుగునది పడయఁజేతు మీవరమొసంగు
మంచున్ ॥ శ్రీ ॥

6. భస్మంబిడుమని పల్కిన గురుడను పార్ధివేంద్రు వినుమా ।
తలపులు దబ్బరైన ఘనమా । నిరతము దప్పకున్న గొ
నుమా ॥ యిచ్చెద । నసమలోచనునిభూతిని నీకిదె యభి
మతముగ గొనుమా ॥ శ్రీ ॥

7. సత్యము తప్పక జంగమయ్యలకు సంతసంబు మీరన్ । వార
లు జడియకెద్ది కోరన్ । ఒసగక గర్వించిన ఘోరం ॥ బగు
నరకంబున బడుదురు గురుశిష్యులు యమపురికిని జేరన్ ॥ శ్రీ ॥

8. నీరధులింకిన నింగివ్రాలినను నిక్కువమిది దాటన్ । గను
డిక చయ్యన నానోటన్ । మీరీసందియ మెప్పాటన్ ॥
విడుడని జననాథుడు ధరియించెను భస్మము కుతుకముతో
నుదుటన్ ॥ శ్రీ ॥

9. ఇటుధరించిచని యిల భల్లాణుం డెలమిని మొగసాలన్ ।
పంతం బయ్యెరుగులీలన్ ।. మ్రోయగ బాసజేసె కేలన్ ॥
వినుడో యయ్యలార యే నిచ్చెద నెవ్వారడిగికొన్న
చాలన్ ॥ శ్రీ ॥

10. ఒట్టుబెట్టితిని యొడయలకోర్కెల వారితముగ గూర్చ ।
జాలక వదలిన ననుజేర్చ । గలదివట్టు భాగ్యమార్చ ।
దగునని మెల్లరువినగా ఘంటారావం బెసగజేసె దీర్చ ॥ శ్రీ ॥

11. ఆరవమెల్ల దిశావలయములో నయ్యలువిని వారల్ । దా
టిరి తమ తమ పొలిమేరల్ । కడచిరి రాజునగరి ద్వారాల్ ॥
గోరెరి కషుచోద్యంబుగ నలయు వస్తువులు కాంత్లుమీరు
హారాల్ ॥ శ్రీ ॥

12. గజరథ తురగ గ్రామము లయ్యల కర్పించెను భక్తిన్ ।
జనపతి యఖిలం బనురక్తిన్ । గురువరు శాసనమున సూ
క్తిన్ ॥ ఒసగుటగని నారదముని కంకిరవు డాకైలాసము
శకె న

13. చని శీతాచలకన్యకు తత్కథ శ్రీవణానందముగన్ । జెల్పిన
గౌరి యమందముగన్ । శూలికి చెప్పిన దందముగన్ ॥
శివుడనె చిత్రము మద్భక్తుం డాభూవిభు జేరెద దంద్ర
ముగన్ ॥ శ్రీ ॥

14. కొలువై యుండుము సతినే నాతని కోర్కెదీర్చి వత్తున్ ।
జంగమ వేసమూని వొత్తున్ । పురిలో చిత్తంబిగురొత్తున్ ॥
నరపతిగుణి మెంతటిదో కనియెద నాగిన మోక్షం
బెత్తున్ ॥ శ్రీ ॥

15. అని శివుడీ గతి సతికి జెప్పిడానరిగె మిండజంగం । బనుచున్
సింధుకటక తుంగం । బెన్నగదగు మె దివ్యలింగం ॥ బప్పరిక
రిగె వాంసతులందరు మెచ్చనౌర సుందరాంగం ॥ శ్రీ ॥

16. వీటఁగల వెలయాండ్రకు దానే వేనవేలు కాగన్ । దోచు
చు నాటిరాత్రి బాగఁ । పొందుకు మూటలిచ్చి వేగఁ॥
వాటమయిన జారాకృతితో నరవరుని జేరరాగఁ ॥ శ్రీ॥

17. భూవరు డెదురుగజని పాద్యంబిడి సేవకీల్లు జేర్చెఁ । అయ్య
కు పూజలొనర దీర్చెఁ । విందులు పొలుపొందగ కూర్చెఁ॥
ప్రొద్దాయెను భోజనముస కనుచును స్నానజల మమ
ర్చెఁ ॥ శ్రీ॥

18. అనిభల్లాణుడు విన్నవింప నాయయ్య బల్కె రాజా । విం
దులు వలదో రవితేజా । లంజయె వలయును మానై జ ॥
మెరుగవె లంజలేని విందొల్లము వడి డెమ్మర్ధికల్పభూజా॥శ్రీ॥

19. మిండజంగ మీరీతిబల్కినను మేదినీశు డెలమిఁ । బల్కె
ను జనదుమీకు చెలిమిఁ । గోరుడు వలసినట్టి కలిమిఁ॥
కోపము వల దస్మద్భూవలయ మొసంగెద వాసినేలు బ
లిమిఁ ॥ శ్రీ॥

20. రాజ్యసంపదలు మాకేటికి భూరమణ వేశ్యదెమ్మా । మీద
ట విందుగుడుతు లెమ్మా । భోగము లందు నీకుసుమ్మా
తథ్యము మాఱువల్కినను మగనాలయినను మంకునొల్ల
సుమ్మా ॥ శ్రీ॥

21. హస్తిని చిత్తిని శంఖినిజాతుల యతివ నేనొల్లా । మూఁగ
లు రాగలయినఁగల్లా । వ్యాధి విరాగులైనఁ జెల్ల దచ్చెలి
పద్మిని కులమై పతిహితోక్తి జనుభామయైన కొల్లా ॥ శ్రీ॥

22. తేలేనుండిన లేదను మరిగెద మేలజాగుసేయన్ । అయ్యోల
కెల్ల పొద్దుపోయెన్ । బల్కకు మాటులింక జేయం॥ గల
పని జేసెదవేని రయంబున చక్కని చెలిని దెమ్ము వె
లయన్ ॥ శ్రీ ॥

23. అని కపటాకృతి జంగముపల్కిన నవనీశుడు వచ్చెన్ । కొలు
వున కఖిలజనులు మెచ్చెన్ । తగుగతి యోచించె నతనియి
చ్చెన్॥ కావలివారల బిలచి పురంబు వేశ్యల నరయగ
బుచ్చెన్ ॥ శ్రీ ॥

24. తలవరులంతట రాజాజ్ఞను తత్సభనుబాసి చనిరి । పురిలో
వీధులెల్ల గనిరి । వేశ్యల కమితధనము గొనిరి । మీరలు
దలచిన కోర్కె ఘటింతుము రమ్మని చలముసేయ కనిరి ॥—

25. మున్ను శివుండేయైయుండెను దా మిండజంగములబారుల్ ।
పురిలోకన్నెరికపు తీరుల్ ।గలిగి చెలులును తగపరిచారుల్॥
నగుచు దదున్నతభోగము లొందుకతన రారన్నవారి పేరుల్॥

26. బండరువారి యింటికిజని యాబాలను రా బిలువన్ । దగు
మిండండు గలడు కలువన్ । కూటమి కేరుపాటు లాదవన్॥
న్యాయమటండీ మానుట రానని ఖండితోక్తి నుడువన్॥ శ్రీ॥

27. మద్దెలవారి వెలందిని రమ్మని మాడలీయనొప్పన్ । కూయ
కు మగడు గలడు రెప్పన్ । జూచిన సొడ్డువచ్చు చెప్పన్॥
గలవా హద్దుమీరుటలు మాబోటులకది పెద్దరికమెతప్పన్॥

28. కనకలవారి వెలందిని పిలచిన కలడువిటుడు గానన్ । రాజ
నదరుగమయ్యా దీనన్ । వేమరు మరుని గెల్చుదానన్ ॥
ధనము చిరంబా కాంతుని బాసిన తనువదేల బూనన్॥ శ్రీ॥

29. వినుడీరీతిని వారకామినులు విటులతోడ గలసి । భోగము లనుభవించి రలసి । చిక్కని తెరగు దెల్పవలసి॥ వచ్చితి మి న తేజాయని చారులు వల్కిన నీశ్వరేచ్ఛ దెలిసి ॥ శ్రీ ॥

30. కుహనాకృతి దానేగివినియె సంకోజపడకవీటన్ । రతిబం ధములను మదినాటన్ । వేశ్యలు విటులదీర్పు తేటన్॥ చా టున బహువిధరతులను పణతు లయ్యలకు భావ మిచ్చు చోటన్ ॥ శ్రీ ॥

31. విరిశయ్యాతల గతులయి రతులను విటులగూడు మేరల్ । భోగము లనుభవించు తీరుల్ । శిగముడు లూడియున్న నారుల్ ॥ నలుకల మరిగిన నయ్యలు బ్రితిమాలి కలి యువారల్ ॥ శ్రీ ॥

32. తూగుటుయ్యేలల దివ్వెలు మెరయగ నూగెడుచందము లన్ । సుఖముల గూర్తురు డెందములన్ । కుక్కుట శుక పికబంధములన్ । దగ ననురాగముననుగూడెడి యారమ ణీబృందములన్ ॥ శ్రీ ॥

33. మర్కట వృషభవ్యాఘ్ర ఫణీశ్వర మహిషబంధరితులన్ । కర్తరి కమలబంధ గతులన్ । రాజితమానసీయ నుతు లన్॥ స్వైరిణు లర్కకోటి తేజాంగ జంగముల నలయించిరి పతులన్ ॥ శ్రీ ॥

34. ఎచ్చటజూచిన మిండజంగముల కెడము లేక మోత్రలన్ । పురిలో నిండియున్న ఘోలన్ । గని నరనాథు డెదనుచాలన్ ఏమిచేయుటకు దోపక మది నివ్వెరగు దోచె లీలన్ ॥ శ్రీ ॥

35. జనపతినై వెలయాలికొరకు నే జనినగాక యున్నఁ । భక్తి
కి పలుచనయ్యె నెన్నన్ । బలిమిని తరుణిబట్టు కొన్నఁ ।
చెరయగు మనసొప్పదు వేసారితి నిక నామగువనీయకున్నఁ॥

36. వ్రతము భంగమగు కులసతినిచ్చిన వసుధలోన నిందా ।
రెంటను సంధిగలిగె ముందా । వ్రతమును దీర్చిమీాద
గొందా ॥ నిందను మతిమంతులకిల మానముతోడ సమా
నమేది పొంద ॥ శ్రీ ॥

37. మానము ప్రాణము లర్పించినదగు మహిని యశము నొం
దఁ । గావున మగువనిత్తు,నొందఁ । జంగము లవురయ
నగ విందుఁ॥ నిజమని । పూనికచే దన గేహమునకు వేబో
యి సతికిముందుఁ ॥ శ్రీ ॥

38. గలకార్యపువిధ మాలోచనగా బలుకరించిచూడఁ । కుల
సతి కాంతుని గొనియాడఁ । మీారేయాజ్ఞసేయ నోడఁ,
బనుపుడు । తనరిన పనికని వినయమొప్ప మోదమునబల్కు
జాడఁ ॥ శ్రీ ॥

39. వినవేచెలి నే డయ్యకుఁ చక్కని వేశ్యవలసియూరఁ । వెద
కిన నెలతలింపుగోరఁ । పల్లవ జనులతోడ మీారఁ । సు
ఖముల । దనిసియుండి గొకతరుణియు దొరుకదు దైవమా
య చేరఁ ॥ శ్రీ ॥

40. ఎన్నదరమె యాపన్నగభూషణు నేరికయిన నింకా । బొగ
డగ వెన్ననికే శంకా । గల్గును చిన్నగ మనకింకా । శివపు
జా । సన్నమగుచు జారాకృతి గన్పడి సతినిగోరుకింక ॥ శ్రీ ॥

41. చిత్రింబన విని భార్యపల్కె పరశివకథా వినోదం। బరు
దంభు అవతరించి మోదం। బుగ నిమ్మవ్వతోడవాదం॥
బున। సుతు జంపించుటకై యన్నము అడిగిన దామిాదఁ॥

42. చిఱుతొండని పట్టిని జంపిన శీలురెకారయ్యా। వీరల చ
ర్య లరయనెయ్య। మఱు నీభక్తి జూడనయ్య॥ తెమ్మనె।
తరుణిని గావున బంపుము నన్నిక తడవికేలనయ్యా॥ శ్రీ॥

43. మున్ను హరిశ్చంద్రుడను రాజును మోసపెట్టదలచి। దా
నంబడుగ నతడు గొలిచి। మునికై యాలినమ్మి నిలచి॥
సత్యము। దన్నుగాచునని నూలనింటిలోనున్న తరినివలచి॥

44. బోవలేదె శివుడంతట నట్టుల బోషించును మనలఁ।
బంపుము జంగమయ్య గనలఁ। గలడని సతిబల్కిన ఘన
లం॥ పటుడయి। భావంబున జింతించె నట్లనుచు బోవ
వలసె జనులఁ।

45. నీవులేని యీరాజ్యమేల నోనీరజాక్షి నాకుఁ। భాగ్యం
బేలగోలదాకుఁ। నిన్నే పంపవలసెవీకఁ॥ నీసాగ నేవనిత
కు గలదీభువి నిన్నువిడిచిన నిలుతునె కలకఁ॥ శ్రీ॥

46. అని నరనాథుడు పశ్చాత్తాపంబునను భార్య కనియెఁ। నీ
మన మరసితి నిజమనియెఁ। సంశయ మూర పాశిచని
యెఁ॥ వేగమె। ఘనవేశ్యాకృతి నందుమన్న సతి కాంత్తు
లెల గొనియెఁ॥

47. గడియలోన దా భాసురాంగి యాకాంత్తుని కడకేగెగా ।
దలచిన మల్లికాంబ వేగగా । బల్కెను చెల్లమాంబతా
గం । బగునే । పుడమికి బట్టపురాణివె యగుచుం। బాల్ప
గ నీవేగగా ॥ శ్రీ ॥

48. నిన్ను బంపుటకు ప్రౌఢవు కావా వన్నెగానితోడ । పొం
దుకు జనిన నోముదాడ । మనవ్రిత మెన్నబడియె నీడ ।
దప్పక। నున్న చాలునే చెల్లీ యేగెద నెన్ననయ్యాగూడ ॥-

49. అని సింగారము చేసికొనియె జెల్లాంబ శివిమీరగా । హారం
బురమునందు జారగా । చెలువల కపుడు మోదమలరగా ।
కరకంఖణములు మోగ్రియగ జెంపకొప్పునను కలువ విరులు
పొనరగా ॥ శ్రీ ॥

50. పరిమళ గంధమలందె దేహమున భావికార్య సరణి । కను
గతి పతి వచించు కరణి । దోచెను ప్రౌఢలీల హారిణీ ।
లోచన। సరసిజేక్షణ లందరు మెచ్చగ శైవయోగసరణి ॥-

51. వచ్చి నిల్చు సతి వడి దెచ్చియు భూవరు డయ్యరు నివ్వగా॥
గడగుచు బల్కె మీకు శివిగా । దనరిన వేశ్య దెచ్చి
తివ్వగా ॥ జూడకు । డిచ్చితి గైకొనుడనె రాజాయన యెగసి
లేచి రవ్వగా ॥ శ్రీ॥

52. అయ్యవల్కె మాపయి చిత్తముగలదయ్యా భూపాలా ।
మీకిది నెయ్యమగునె చాలా। నమ్మితి సయ్యాటము లేలా।

నడిజా । మయ్యో నీదు రాకరయుచుండ మూడయ్యో గన్న తేలా ॥ శ్రీ ॥

53. తలపదలంపగ తనువు సగంబై తాపమెల్ల గ్రుంగెగా । అయ్యల భక్తి నీకు వంగెగా । సత్యపు బాసలో నడంగెగా। గుణవతి లలనయటంచు వచించితి వయినను వలసి రాగ డంగుగా ॥ శ్రీ ॥

54. పనికిరాని యీభామ నివ్వగా ఫలమే జననాధా । నీవే యేలుకొన్న మేధ । గలుగును నేను తపోగాధ । నొందితి జనుమని కోపంబున వచించెనా జంగమయ్య బోధ॥ శ్రీ॥

55. అనుగుణంబుగా వినయోక్తులచే నవనీశుడు వలుకగా । మీరెట్లనిన జెల్లు నలుకగా । మానుం డపరాధము చులుకగా । జేయుడు కనకాంగిని మీకొఱకు దెచ్చితిని కన్న తల్లి యిలకుగా ॥

56. ఆకలిదీర్పగ నన్నుమిడగ వద్దనుట దగునటయ్యా । అయ్యా నీకు శరణమయ్యా । దేవ పరాకుసేయకయ్యా । నీకై రా కాశశిముఖ నరయగ నింతగ రాత్రికడచె నయ్యా ॥ శ్రీ॥

57. జనపతి యీపగిది వచింప జంగమయ్య మెచ్చి । రాజు ను తనదరి రాబుచ్చి । యతనికి ముదమున జనువిచ్చి । నాకుగా మదికొప్పెడుచెలి నరసి తెచ్చితివి మంచిదాయె హెచ్చి ॥ శ్రీ ॥

58. నీదుసెజ్జకును జేర్పుము నన్నీనెలతతోడ కేళిగ । గూడెద సుఖరతి నికహాళిగ । అన నిజశయ్యను బుష్పాళిగ । బఱచి మహాదరమున నయ్యకు బనిచె నుహ్రాత్కామ లాళిగ ॥ శ్రీ ॥

59. ఖడ్గము గైకొని కందు గూఢముగ క్రమమొప్పగ నన్నుగ । ఏగతిజూతు వంతకన్నుగ । మిన్నగ నయ్య జేరకున్నగ । దు్రించెద వద్గుణవతివని సరసకుగొన శివచరణ మాన యొన్నుగ ॥ శ్రీ ॥

60. అని వచించి ధాత్రీశుడరుగ నాచెల్లమాంబ సొంపుల్ । తగరాయంచనడక పెంపుల్ । మీరగ నతిరసముల గుం పుల్ । గల నూతనపక్వాన్న ఫలంబుల దనరజేసి యిం పుల్ ॥ శ్రీ ॥

61. నిండజేసి పాదంబుల కెరగుచు నీతినయ్యతోడ । జూడ వీతఱి ననుగూడ । వేటికి ముగుద వన్నెకాడా । య నుచుం గందర్పాను కరోక్త్తులాడ ననురాగ మొనయ దేడ ॥ శ్రీ ॥

62. మిండజంగమా మేరగునేసామీ యీసిగ్గుం జెందగ । పొందం గౌగిటబిగి నొందగ । నీవెద జేర్పకున్న ముందుగ । నేనెటు లండజేరుదును పొద్దామెను నన్ననురాగముతో బొందగ ॥ శ్రీ ॥

63. మోవి సుధారసమాని ముద్దిడని మగతన మదియేల । గో
లా పట్టిభ్రాంతి లీల। మేలా శీల మెన్నజాల । ననుచుఁ
భావములోపల రోసమొలయ నటుపల్కె ధీవిశాల ॥ శ్రీ ॥

64. ఎట్లాడిన మగటిమి లేదయ్యకు నెట్లు చుక్క పొడిచెఁ ।
వృథాగా రాతిరేల్ల గడచెఁ । గల చెంగలువలెల్ల ముడి
చెఁ । దగు చీకట్లుపోయి తెలుపయ్యె దిశలు భాస్కరు
డింకం బొడుచుఁ ॥

65. బలిమినయిన నక్కన జేర్చెద పతిహితంబు గోరి । అయ్య
ను పాన్పుకడకు జేర్చి। యనిచనె చెల్లమాంబనారి। చెలు
లిల కలకాలము దన్నభినుతింప విటకానికడకు మీరి॥ శ్రీ ॥

66. మేను శివార్పణ జేయబూని యామేదినీశ కాంత । జంగ
మునంటి యుగిలికింత । బెట్టుచు కౌగలించునంత । హరుడ
మ్మానిని మెచ్చి విటాకృతిపోవగ మాయమాయె నంత ॥

67. కనుబాలునికిఁయ కరములలో దగ చనులజేపు పుట్టెఁ ।
పతికనె శంకరుండు పుట్టెఁ । చూడుము జంగమయ్య పు
ట్టెఁ । బాలుడు చనులు గుడుచుచున్నా డిదిగోయని
చాటున గనబట్టెఁ ॥ శ్రీ

68. మునుగొడాడ్రిలవు కద యీబాలుని గనుట నిక్కముగునా।
అయ్యను గినిసిపుచ్చ దగునా । సరిగా బల్కెదొక్క మొ
గిన । బొంకితి వనుమానము గల్గెను ఖండించెద । ననిన
వనిత నగిన ॥ శ్రీ ॥

69. అంతలోన శివుడో భళ్లాణనృపా! సాహస మదియేలా । నేనా బూటకంపులీలా । జేసితి బోటి సుగుణశీల । వలదా । వరుసే మానికోరుము నేవేనియు వరము లిత్తు చాలా ॥ శ్రీ ॥

70. కోరుమింక నీభక్తికి మెచ్చితి కోర్కెదీర్చబూని । భాస్కర కోటితేజ మూని । పాడమిత్రి తలిదండ్రులుగాని । మీరలు వేరుగారు మీతనయుడ నేనన వెలది జంపమాని ॥ శ్రీ ॥

71. సన్నుతించె భళ్లాణుం డీగతి శంభో శివదేవా । పాడమితి సరగున మముగావ । మునుపటి పాపమడగిపోవ । సేవ లెన్ని చేసితినో యీడేరెను మాకింక భక్తితోవ ॥ శ్రీ ॥

72. హరిధాతాద్రి సమర్చితాంఘ్రి బ్రిహ్మర్షి వినుతశీలా । నిరంతర సామగాన లోలా । సముచిత తాండవమ్మృదు ఖేలా । లీలా । కాలకాల దిక్చేల విబుధముని । జాల । లోకపాలా ॥ శ్రీ ॥

73. అనిమ్రొక్కిన నుమ కనియె శూలి। యీ జనపతి ధన్యుండు చూచితె వనిత నిచ్చియుండు। భక్తిని దీటు లేదోకండు । ఇతనికి । ఘనతమీర సాలోక్యమియ్యగా । గడగితి నిక తెండు ॥ శ్రీ ॥

74. దివ్యవిమానం బనిపలికిన గనుతేజమెసగవచ్చె । పార్వతి విభుని మహిమ మెచ్చె । విబుధుల విరులవాన హెచ్చె । వారల । నవ్యవధిగ సతినతో గైలాసము । నతి ముదముగ జేర్చె

75. సతియుగంబుతో భల్లాణుండా శంభులోక మందుఙ్ । రాజై ప్రమథులు కొలువందఙ్ । శివుడాగతిని కొల్వైజెం దెన్ । ఈకథ । నతులితముగ సూతుడు శౌనకముఖ । వితతి మోదమందఙ్ ॥ శ్రీ ॥

76. తెల్పినకరణిని శివవెంకాన్వయ కవిశంభులింగం । బీకృతి జేసెదీని సాంగం। బుగవిన నమలమంతరంగం । బగు శివ సాయుజ్యము చేకురును రవిచంద్రులవలె నిలజెలంగుఙ్॥ ॥ శ్రీ ॥

సమాప్తము.





# కోలాటము.

రాగం - నాదనామక్రియ.

1. శంకరార్ధధారిణి యేతలపగ । జననిసుమ్మి మాకు । రూఢిగ జనని సుమ్మి మాకు॥-పంకరుహాక్ష సమర్చితుడగు నేణాంకుడయ్య మాకు।రూఢిగ। నేణాంకుడయ్య మాకు॥పల్లవి॥

2. భవ్యములగు భస్మత్రిపుండ్రములె పావనమవి మాకు । రూఢిగ బావనమవి మాకు ॥ అవ్యయమానదగు జ్ఞానముద్రియే । యాధారము మాకు । రూఢిగ నాధారము మాకు ॥ శం ॥

3. అక్షయమగు రుద్రాక్షులసరమే యాభరణము మాకు । రూఢిగ నాభరణము మాకు ॥ మోక్షదమగు పంచాక్షరి దాతయె ముఖ్యగురువు మాకు । రూఢిగ ముఖ్యగురువు మాకు ॥ శం ॥

4. కాశి ప్రముఖ శివక్షేత్రములు నివేశనములు మాకు । రూఢి నివేశనములు మాకు॥ కేశవ స్తుత చరణోదకమే కేవలమది మాకు । రూఢిగ కేవలమది మాకు ।

5. బసవాద్యఖిల పురాతనభక్తులు పాశుపతులు మాకు । రూఢిగ బాశుపతులు మాకు । అసమానంబగు శైవపంచ కమె యాప్తపదము మాకు । రూఢిగ నాప్తపదము మాకు ॥ శం ॥

6. భక్తసమూహము చెంతవసించుటె బాంధవ్యము మాకు। రూఢిగ బాంధవ్యము మాకు ॥ ముక్తీశ్వరు భజనం బొనర్చుటయె మోక్షపథము మాకు। రూఢిగ మోక్ష పథము మాకు ॥ శం ॥

7. లింగాంగైక్య జ్ఞానుల కోటియె శృంగారము మాకు ॥ రూ ఢిగ శృంగారము మాకు । మంగళతర హృల్లింగార్చన మే మహితపదవి మాకు । రూఢిగ మహితపదవి మాకు ॥

8. ఇంద్రనీల మణులను స్థాపించిన యింప్లుకలవు మాకు । రూఢిగ నింప్లుకలవు మాకు ॥ చంద్రమౌళి కరుణార సంబుచే జయము లొసగు మాకు । రూఢిగ జయము లొసగు మాకు ॥ శం ॥

9. అల్లమ ప్రభుని యనుభవమె వెల్లచామరము మాకు । రూఢిగ వెల్లచామరము మాకు ॥ ఎల్లమంద కోటీశ్వరు సేవయె కొల్ల జేయు మాకు। రూఢిగ కొల్ల జేయు మాకు॥ శం ॥

—:o:—



# సానందోపాఖ్యానము.

✱ గజేంద్రమోక్షము – 'రాజేంద్ర వినుము' అనుమాదిరి. ✱

జనులారా సానంద ముని చరిత్రము మీరు వినుడీ వేను కమీరను । కైవల్యము గనుడిక సమకూరును॥ పల్లవి ॥
అనుపల్లవి ॥ తనరు నైమిశనామ వనమతిరమ్యమై మును వెల్గు చందనముఖ తరుకోటిచే। ఘనతమించు రసాలరంభా, కనకలుంగలవంగకాంచన, పనసజాజి వకుళచంపక, పారిజాతములను జెలంగును ॥ జనులార ॥

1. తరుణ పల్లవితకోరకిత పుష్పితఫలభరిత । మకరందంబులు, క్రోలెడు మత్తమధుకర బృందంబులు। వైరత్యక్త। హరిరాట్కరీంద్రంబులు । సరోవరచరపక్షిసాంద్రంబులు । సదామ్నాయ ॥ పారగద్విజకుల సారనాటక కావ్యాధార తర్కశాస్త్ర ధీరపండితలోకా ॥ ధారమై, యజ్ఞాదులకు సం । చారమై, కలుషాంధకార వి । దూరమై, శివభక్తి లలితో । దారమై, నైమిశము పోల్చును ॥ జనులార ॥

2. శౌనకుడాదిగా గలమునివర్యులు కనిరిసూతుని సూక్తిగా। నాకాంక్షచే । మనవిచేసిరి యుక్తిగా । పురహరుకథ । లను దినంబును భక్తిగా । నాతఁడు దెల్ప । వినిరి వారను రక్తిగా ॥ సువ్యక్తిగా ॥ మనములు రంజిల్ల । గనుసానం దుడ। న్మని పాపులనుమోక్ష మొంద జేతునటంచు॥ తన మదిం దగ శమనునగరికి జనియొబుష్పక మెక్కి సంయమ । లనుపగోర్కెలు గూర్చుతలపున । మనసిజాంతకు దలచు చును వడి ॥ జనులార ॥

3. మునిరాక నెరిగింతు ననుచు నారదమౌని । పనిబూనె నత్యంతము । కాలుఁడు గని । వినియె నా వృత్తాంతము । పురిబీడౌనో । యని కొంత సుస్వాంతము । ధైర్యముతోడ ననియె తనకీపంతము । చెల్లదురా నీ॥ కనివచ్చు తోర్రి వ నే । గును దాను వెనువెంట । ననుచుండ । దివమున। గనుపించె ముని తేరు॥ మనము జల్లనచేయునదిలే। మిని భటాళిని దోడుకొని రా । దినకరాత్మజు డెమరుగాజని । వినయముగ బూజించి తెచ్చెను ॥ జనులార ॥

4. తొల్లి నారదుఁడు తాజల్లగ దెల్పిన జెల్లదాతని కంటిని । దావచ్చిన వెఘ్నవా డనుకొంటిని । నిక్కపుబుషి । వల్ల భునిటగంటిని । ఈతని తలంపెల్ల నేగనుగొంటిని ॥ రమ్మం టిని ॥- చెల్లదునే నేమి, పల్లిదంబులువల్క, నుల్లమందు నగోప, మొదవి శపించును॥- కల్లగాదిది వీరి కడ్డం, బెల్ల వేల్పులురారె యికసో, వల్లెపాడగు జాడతోచెను । బల్లి దులు వీరనియె శమనుఁడు ॥ జనులార ॥

5. భానుసుతునిజూచి, పరమామోదంబున । బలికె వేడుకతో
డను । నీ మర్యాద । కేనుమెచ్చితి నీడను । బుద్ధిపొడమె,
నౌ నీ పురము జూడగను । వేగమెరమ్మ హా! నీదు పదమే
డను ॥ ధర్మపుగాడె ॥- మాను సందేహంబు, మదివికసిం
పగ । బూనునగరు జూపగాను సంతోషింతు॥ మేనులచిర
ము లుపకృతియె తన । తోను దోడుగనేగి మనకీ । జ్ఞాన
ముదయించినను మేలగు ।• నేను దెల్పెడి దేవియనె ముని॥
జనులార ॥

6. పురము శృంగారింప, బూనుట కై భేరీ, స్ఫురితస్వనము
మోగెను । మహానిందుగ్రస । కురుభక్తిగ్రీ సేసెను । పా
దుకలిచ్చి । చరణాంజలి జేసెను । అమ్మని దండ । ధరువెంట
విచ్చేసెను । సరిగునబోయి ॥ పురితూర్పునుత్తర । మరయ
జేసిన పుణ్యు । లురువై భవములచే । వరుణద్వారంబుల॥
మెరయుచుండుట జూచి వీరలు । ధరణి నేపుణ్యాయి లొంస
ర్చిరో । పరమపావనులనగ యముడిటు । పల్కెవారల
సుకృతముల దగ ॥ జనులార ॥

7. నిరతాన్న దాన త । త్పరవృత్తి కాలంబు । జరుపువారీ
పుణ్యులు । కూపారామ । విరచను లీ ధన్యులు । తీర్థక్షే
త్రి । పరిదృశ్యు లీ మాన్యులు । జితేంద్రియ । స్ఫురదా
ర్యు లీ గణ్యులు । సౌజన్యులు ॥ హరిపరాయణచిత్త ।
సరసిజు లీఘను । లురుసద్విచార హా । రగు లీ మహాత్మ
లు॥ దురితహరులు । హరునిభక్తులు । గిరిసుతార్చకు లా
త్మవేద్యులు । గురుసమాదరణాఢ్యు లఘ్వర । కరులనగ

ఋషి యరసె వారల ॥ జనులార ॥

8. మూసువాకిళ్లా నా । డాడ బుణ్యుల జూచి నాడ నొ
క్కటి తక్కగా । నది చూపింపు । మీాడ దప్పక చక్కగా ।
పాపులు నిన్ను । వేడి జోడుగ మొ్రక్కగా । దూతలాజ్ఞ ।
నూడిగంబుల నిక్కగా॥ రా పెక్కుగా॥ నాడగల్గువారి ।
జూడనొల్లక బోవ । గూడ దంతకచెప్పు । పాడి తెరగు నీవీ॥
లేడు జగములయందు ధర్మము । కేడ సెసరి వేల్పులంచన
వాడె చిత్తము శమనునకు నది । కూడదని ముని వేసట
కున్నై ॥ జనులార ॥

9. మీావంటివారల । కావాకిలి జూప । మీారేమి కోపింతు
రో । పాపుల గని । దేవా సంతాపింతురో । బాధలు
సూచీ । యేవిధంబుగ నెంతురో । యని వెరగొంద ।
భావ మింకెటు లుంతురో॥ క్షమింతురో॥ దేవరవారెటు ।
తెల్పెదరాలీల । బోవువాడ నాజ్ఞగావలె సెలవిమ్ము ॥ సేవ
కుడనన । దక్షిణంబున । కేవిధించితి సాగుమని నీ । ర్యా
విదోవతి మెరయ గేలను । దావలము ధరియించి ముని
చనె ॥ జనులార ॥

10. ఇవ్వాకిటి చతురమెన్న జతుర్లక్ష । యోజనంబుల నిడుపు।
నహోమయ । మవ్విధమున వెడల్పు । కుంభీపాక ।
మవ్వల గనజనుపు । మడిలేని వా । రెవ్వ రిద్ధర నడపు ॥
పాపంబుల। కివ్వసుంధర నెల । విచట రౌరవంబు । నివ్వటి
ల్లును జూడ । నెవ్వరోపరు మీారే ॥ దవ్వులను గాంచితిరి

చిత్తము । నొవ్వనగు గుందుదురు మిముగని । నెవ్వగల దా మందుచుండగ। నెవ్వరో తము గనిరటంచనె॥జనులార॥

11. దండివాక్యము వినుచుండి వేడుకనేగు । చుండ నక్కడ పాపుల । శిరంబుల । ఖండింపబడు రూపుల । గైకొని కాగు । చుండు నూనెను మూపుల । ముంచెడు భట । తండంబులను కోపుల । నద్దన డంత॥ కుండు తానదిచూచి । కాండజాస్యనుండు । గుండెరాతనుజేసి । దండనీతికి నిన్నా ॥ తండు పరమేశాజ్ఞ బంపెను । చండశాసన వృత్తి నీకథి । కుండు లేడీవిద్య వేరొకరుండిటొల్ల డటుండుమనె ముని ॥ జనులార ॥

12. తపసులగుట మీర లుపకారదృష్టిచే । దగబల్కితిరి రిత్తగా । వీరలదోష । మపనయించెదు సత్తగా । జెల్లును మీకా । యుపమనే నిటుక్రొత్తగా । తప్పరయక । విపరీతమె వృత్తిగా ॥ జేయుటగాదు ॥ చపలాత్ము లీదుష్ట । జనుల కల్మషమెన్న । దపనేందు సాగరాం । తనులదాకను బాధ ॥ లపరిమితముగ బడయగలరిక । సుపథమెక్కడి దరయవీరికి । నెపముబెట్టెద రింకనాపై । గుపితచిత్తము మానుడనె దొర ॥ జనులార ॥

13. కేచిత్పుణ్యంబుచే । కేవలంబుగ మాల । కాచంద్రిధరు లోకము । గల్గెను వీరి । కాచందమున శోకము । మానెడు బుద్ధి । యోచింప సువివేకము । గల్గినదప్పు । సూచీము ఖపాకము ॥ విచారింప । దోచదు వినువీరు । దూర్జటినిం

దకు । లాచార్య సతిబొందు నీచు లన్నముగోరు॥ యాచకుల గెంటంగ జేతులు సాచి రల వారనుజగూడ బ । రాచికము గావించి రార్యుల । జూచి వీరలుగాచ దగ దనె ॥ జనులార ॥

14. ఎంతకూ్రరాత్ముడీ । యంతకుడని ముని । స్వాంతమందు నుదలచి । మోక్షంబివ్వ । కంతుహరుని గొలిచి । పాపుల మధ్య । నెంతో వింతగ నిలిచి । నప్పుడెముక్తి । కాంత వారల వలచి ॥ షడక్షరీ ॥ మంత్రరాజము హరి । దంత రంబులు నిండ । మంతనంబున బొడు । నంతనారకకోటి॥ కంతనే యుపదేశమై క । ర్ణాంతముల సోకినని పుష్పక । మంత కాంతకు డనుపవచ్చెను । గాంతు లంబరమున వె లుంగగ ॥ జనులార

15. భటులు వారిరి రత్న । భర్మ నిర్మితమైన । పటువిమాన ముజూచి । కాలునిగాంచి । కుటిలాత్ములై లేచి । పుష్పక మెక్కి । తటుకున బోగాచి । సానందుని । చటుల మ హిమ కేచీ ॥ శమనుడు తన ॥ పటుసాధనము సం । పుట మున బెట్టి తా । నటువో యె తీవ్రనా । నిటలాక్షుపాలికి॥ కటకటంబడి యీ ప్రభుత్వం । బెటుభరింతును భూసురుం డోక । డటకు దాసిలినాడు పురమి । ప్పటికి బాడొనరించి చనె ననె॥ జనులార॥

16. ఆర్తపోషకుడగు । శూరు డాతనితోడ । ననియె సమ్మని చందురిడూ । భూతదయా। వర్తిత నిస్తందురిడూ । మా

సరిసమ । వర్తి మహిమా సాంద్రుడూ । వెరచును బల్క పూర్తిగా దేవేంద్రుడూ ॥ గావున నీవీ ॥ ధూర్త తనము మాని, వర్తమానంబున । నార్తులైన ఖలుల, బూర్తిగా దండింపు ॥ కీర్తి దిశలవెలుంగగా శివ । లెంకపాపయ మంత్రి సుతుడన । వర్తిలు న్భువి శంభులింగని । నేర్తు బ్రోవగ బొమ్మనియె దగ ॥ జనులార ॥

సంపూర్ణము.

---

## పీఠిక.

సీ॥ శ్రీమన్మహాదేవ సేవాపరాయణుఁ డార్యసన్నుత భూరి యశుఁడునైన
మాదపాట్యన్వయ మహితుఁడౌ వేంకటేశ్వరరావుపంతుల సృద్ధితుండు।
గూడి యొక్కట్టు మాటాడుచునుండంగ నీపురాతన గ్రంథమేనుజూప।
గనుబ్రికటింపంగ ననుబురికొల్పియు నందులకగు ద్రవ్య మప్పుడయొ
[ సగె।

గీ॥ ధార్మికుం డొండె కనుఁగొను ధర్మమందు
రిదియొకద జగదుపకృతి యితఁడొనర్చె
నింతకాలంబు నూరక యేను గడప
నిట్టి పనిబూని యశమంద నీఘనుఁడు॥



